# మా నాన్నగారి జీవిత విశేషాలు



## డా॥ ముట్నూరి సంగమేశం

1919 - 2001

Acc no: 28473

# నా మాట

డా॥ ముట్నూరి సంగమేశం గారు, మా నాన్న గారు ఆయన గురించి, ఆయన యొక్క పాండిత్యం విద్యాకౌశలము, రచనా పద్ధతులు, విమర్శనా రీతులు, ఆయన పొందిన గౌరవ సత్కారములు వారి సమకాలీనులకందరికి విదితమే.

నా తరువాత వచ్చు సంతతివారికి, రాబోవు సాహితీ కోవిదులకు ఉపయోగపడునను ఉద్దేశ్యముతో దీనిని మీముందుంచుచున్నాను.

మీ అందరి ఆదరాభిమానములు కోరుతూ ...

మీ

తిరుపతి

ముట్నూరి అన్నాజీ రావు, ఎం.ఏ.

# పరిచయము

" అష్టభాషా విశారదుడద్భుతావ్య
యామృత రసఝురీ, నృత్యహావభావ
విన్యసన నైపుణీ వచో విభవ శోభి
తుండు సంగమేశ్వర శర్మ నిండు సభల "

మా తండ్రి గారైన కీ.శే. సంగమేశంగారితో పరిచయమేర్పడిన తరుణంలో మహా విద్వాన్ కీ.శే. బ్రహ్మశ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ గారు అన్న మాటలవి. అదేవిషయాన్ని మా నాన్న గార్కి అహిందీ రచయితలకు ఏర్పాటు చేయబడిన హిందీ గ్రంధ రచన పోటీలకు భారత రాష్ట్రపతి పురస్కారం వచ్చిన సందర్భంలో ఏర్పాటు చేసిన సన్మాన సభలో డా॥ మన్నవ భాస్కర్నాయుడు ఈ విధంగా పల్కినారు. " వీరు సర్వతోముఖ ప్రతిభావంతులు. సాహిత్య విమర్శలో వీరిది ఒక స్వతంత్ర విధానము. తిరుపతిలో వీరు లేని సాహిత్య గోష్ఠి లేదంటే అతిశయోక్తి కాదు. అవధానంలో, ఆరితేరిన అష్టవధానులకు, శతావధానులకు కూడ వీరు పృచ్ఛకులుగా ఉన్నారంటే ఎంతో జాగ్రత్త పడవలసిన విషయం"

ఇంకొక చోట వారు (సంగమేశం గారు) సూర్, తులసీ సాహిత్యములు పుక్కిట బట్టిన పుక్కిట కాదుగా ఆపోశనము బట్టిన సాహితీ సుధా పరిపూర్ణ హృదయులుగా, రసహృదయులు, సహృదయులు, మాన్య, సుహృదమ్మణిగా "డా॥ బ్రహ్మశ్రీ ఎ. హనుమచ్ఛాస్త్రి గారి ద్వారా తనకు పరిచయమైనట్లు బహు గ్రంధకర్త, హిందీ సాహితీవేత్త శ్రీ మైలవరపు సూర్యనారాయణ మూర్తి గారు సంబోధించినట్లు తెలియుచున్నది. పై పరిచయ వాక్యములు మా నాన్నగారివి. వారు నృసింహ జయంతి పర్వదినమున, అనగా వైశాఖ శుద్ధ చతుర్దశి శుక్రవారమునకు సరియగు క్రీ॥శ॥ 1919, ఏప్రియలు నెల 25వ తారీఖునాడు శ్రీకాకుళం జిల్లా (కొండాపురం అగ్రహారం) వంతరాం గ్రామములో జన్మించినారు. వీరి తల్లిదండ్రులు బ్రహ్మశ్రీ అన్నప్పవఝ్ఝులు గారు,

శ్రీమతి సూరమ్మగారు. మా గృహ నామము ముట్నూరు వారు. మా నాన్నగార్కి ముగ్గురు తమ్ములు మరియు ముగ్గురు చెల్లెండ్రు. మా తాతగారు ఉపాధ్యాయ వృత్తి నిర్వహిస్తూ పరమ పౌరాణికులుగా వాసికెక్కినట్లు మా పినతండ్రి గారి ఈ క్రింది పద్యము నుండి తెలియుచున్నది.

" చీపురు పల్లె మాకాపురస్థల మాంధ్ర
సంస్కృత భాషా విశారదుండు
పౌరాణికుండును, భరతశాస్త్రజ్ఞుండు
నధ్యాపకుడునగు, నన్నపార్యు
పుత్రుడ, నా పితృవ్యులు మేటి భరత
శాస్త్రజ్ఞులైదుగురు ధర్మశాస్త్ర
నిధియు, మృదంగ వాద్యధురీణడగు సంగ
నార్యుని పౌత్రుండనద్వీ తీయ
బహుముఖ ప్రతిభాశాలి, భవ్య బుద్ధి
యైన సంగమేశార్యుని యవరజుండ
సంస్కృతాంధ్రములొక్కింత చదివనాడ
నవని సూర్య నారాయణుడండ్రు నన్ను".

## విద్యాభ్యాసము - 2

పైన చెప్పబడిన చీపురుపల్లెలో ప్రాథమిక విద్యాభ్యాసము అయిన తరువాత విజయనగరం మహారాజా కళాశాల హైస్కూలులో యస్.యస్.ఎల్.సి. వరకు చదివిఅనంతరం భీమినిపట్టణంలోగల ప్రభుత్వ అధ్యాపక శిక్షణా స్కూలులో ట్రైనింగు పూర్తి చేసి అధ్యాపక వృత్తి చేపట్టినారు. అది స్వాతంత్రోద్యమ కాలము. ఆ ఉద్యమ పోరాటంలో భాగంగా ప్రస్తుత రాజభాష హిందీని తాను అభ్యసించి దానిని ఇతరులకు నేర్పింప మరియు భాషా ప్రచారము చేయడానికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ (మద్రాసు) వారిచే నిర్వహింపబడు హిందీ పరీక్షలు అనగా ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాషా, ప్రవేశిక, రాష్ట్ర భాషా విశారద పూర్వార్ధ,

ఉత్తరార్థ పరీక్షలు అన్నింటియందు ఉత్తీర్ణత సాధించిరి. ఇవే కాకుండా అలహాబాదు విశ్వవిద్యాలయంవారి 'సాహిత్యరత్న' పరీక్ష కూడ ప్రధమ శ్రేణిలో ఉత్తీర్ణులైరి. మా నాన్న గారి ఉన్నత విద్యాభ్యాసమంతయు స్వతంత్రముగానే సాగినది. ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి ఇంటర్, బి.ఏ., మరియు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం వారి ఎం.ఏ. పరీక్షయందు వారు ద్వితీయ స్థానము సాధించిరి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము నందు డాక్టరేటు పట్టం, భాగల్‌పూరు విశ్వ విద్యాలయము నుండి డి.లిట్. పట్టాన్ని కూడ పొందిరి. ఈ సందర్భంలో మానాన్నగారి అత్యంత మిత్రులు, సహోద్యోగి అయిన డా॥ ఎస్.టి. నరసింహాచార్య గారు ఇట్లు చమత్కరించిరి. "మా అన్న గారైన సంగమేశం సదా విద్యార్థి, అతనొక నైష్ఠికుడు. ఆయన ఆలోచన (విమర్శ) వ్యాసంగములు బహు నిష్ఠతో కూడినవి.



## ఉద్యోగము - 3

మా నాన్న గారు ఉపాధ్యాయ వృత్తినే చేపట్టినారు. విశాఖ పురపాలకోన్నత పాఠశాల యందు 1951 వరకు గ్రేడు 1 హిందీ పండితులుగా పని చేసినారు. 1951 నుండి 1957 ఆగష్టు వరకు మంగుళూరు మరియు మద్రాసు ప్రభుత్వ కళాశాలలో హిందీ ఉపన్యాసకులుగా అదే సం॥ అనగా 1957 ఆగష్టు నుండి 1976వరకు తిరుపతి శ్రీ వేంకటేశ్వరా కళాశాలలో, హిందీ శాఖలో ప్రధానాచార్యులుగా పని చేసిరి. తరువాత యు.జి.సి. వారంద చేసిన గౌరవ వేతనము మీద 1980 వరకు పరిశోధకులుగా పని చేసిరి.

1960లో తిరుపతిలో హిందీ ప్రేమీ మండలిని స్థాపించి దక్షిణ భారత హిందీ ప్రచారసభ (ఆంధ్ర) హైదరాబాదు మరియు మద్రాసు వారు నిర్వహించు హిందీ పరీక్షలకు హాజరు కాగోరు విద్యార్థులకు ఉచిత బోధన చేసినారు.

## విద్యాపరమైన సేవలు

మెట్రిక్యులేషను పరీక్ష నుండి ఎం.ఏ. పరీక్ష వరకు పరీక్షాధికారిగా వ్యవహరించినారు. పాఠ్యావళి, కమిటీల యందు పాఠ్య పుస్తక మండలుల

యందు, విశ్వ విద్యాలయం వారి బోర్డు ఆఫ్ స్టడీసు నందు పనిచేసిరి. పాఠ్య గ్రంథములు రచించిరి. వారొక ఉద్యోగ ధరఖాస్తు నందు ఇట్లు తెలియ జేసిరి.

" నా చాల, మంచి పుస్తకములు ఆంధ్ర, మద్రాసు మరియు మైసూరు రాష్ట్ర ప్రభుత్వముల వారి ఉన్నత పాఠశాలల యందు పాఠ్య గ్రంథములుగా ఆమోదించబడినవి. నేను పలుసార్లు ఎన్నియో సాహితీ సమావేశములందు, ఆకాశవాణి సాహిత్య గోష్ఠులయందు పాల్గొంటిని. నేను భారతీయ జ్ఞానపీఠ కలకత్తా వారికి సలహాదారుడను. న్యూ ఢిల్లీ సాహిత్య అకాడమికి అనువాదకుడను నేను. అధిక విద్యాప్రమాణములు కలిగిన రచనలు హిందీలోను చేసినాను. అదే విధంగా ఎన్నో వ్యాసములు సాహిత్య, నాట్య, సంగీత, జ్యోతిషపరమైనవి హిందీ తెలుగు, ఆంగ్లము మరియు కన్నడ భాషలలో రచియించినాను ".

## మహా పండితులతో పరిచయము - 4

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారితోను ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారి తోను, శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారితోను, ఆచార్య రాయప్రోలు సుబ్బారావు గారితోను, శ్రీకోరాడ రామకృష్ణయ్య గారితోను, డా॥ నిడుదవోలు వేంకటరావుగారి తోను వారికి సన్నిహిత పరిచయమున్నట్లు తెలియుచున్నది. డా॥ సాళ్వ కృష్ణమూర్తి గారితో (మద్రాసు) కలిసి భారతిలో (సాహితీ మాసపత్రిక)లో భామాకలాపము మీద పెక్కు వ్యాసములు రచియించిరి. వీరే కాకుండా తిరుపతిలోనున్న పండితులతోను సాహిత్య ప్రకాండులతోను మా నాన్నగార్కి స్నేహపూర్వక పరిచయముండెడిది.

## రచనా పద్ధతులు - 5

మా నాన్న గారి రచనా విధానము ప్రశంసనీయమే గాక అను సరనీయము. వీరి గ్రంథములను ఎందరో వారి యొక్క రచనావ్యాసంగమునకు ఉపయోగించుకొనిరి. తి.తి.దే. వారి " సప్తగిరి " మాసపత్రిక హిందీ, తెలుగు భాషలలో అనేక వ్యాసములను రచియించి పాఠకుల మన్నలను పొందిరి. శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ఆశీర్వచనములతో నడపబడుచున్న ఈ పత్రికపై మా నాన్నగార్కి అభిమానం మెండు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిచే అత్యుత్తమ గ్రంథముగా 1952వ సం॥లో ఎంపికచేయబడిన "తెలుగుహాస్యం" చాల మందికి వారి విమర్శనకు, వ్యాసాలకు సహాయక గ్రంథంగా ఉపయోగబడినది. అందు కొన్ని భాగాలను యథాతథంగా గ్రహించడం జరిగింది. తెలుగు హాస్యం గ్రంథపీఠికలో ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారి ప్రధాన కార్యదర్శి శ్రీపరిజాల హనుమంతరావు గారు "మన సాహిత్య వేత్తలు తమ దృష్టి ఉత్తమమైన సమీక్షలను వెలయింపవలయును. ఈ విషయమున చక్కని కృషి చేసిన సాహిత్యాచ్చార్యులు శ్రీ ముట్నూరి సంగమేశంగారు. ఆంధ్రలోకమున కొక ఉత్తమ రచనను అందించినారు. ఈ పుస్తకమునకు బహుమాన మొసగిన భాషా సమితిని ప్రశంసించు చున్నాను".

మా నాన్న గారు శ్రమించి వ్రాసిన భక్తి, సాహిత్య, నృత్య, జ్యోతిష సంబంధమైన వ్యాసాలు, వ్యాస రచనా విధానము ఎందరికో మార్గదర్శికాలు అయినాయి.

అన్నమాచార్య సూర్ దాసు అనే శీర్షికన వెలువడిన వ్యాసారంభంలో ఈ విధంగా వుంది.

"శ్రీ వేంకటేశ్వరుని 32 వేల కీర్తనలతో వర్ణించి తరించిన ధన్యజీవి అన్నమయ్య, లీలావినోదియగు కృష్ణ పరమాత్మను వాత్సల్య భక్తితో వర్ణించి, మురిసిన వ్యక్తి సూర్ దాస్. భాగవతంలోని మధుర భక్తి భావనకి ఇద్దరూ ప్రతీకలే. అధ్యాపక వృత్తిలో హిందీ సాహిత్యాన్ని పరిశోధనా మూలంగా అన్నమయ్య భావాలను ఆకళింపు కొన్న వ్యక్తి శ్రీ సంగమేశంగారు. ఈ వ్యాసంలో అన్నమాచార్యుల ఆధ్యాత్మ కీర్తనలు కావ్యస్వరూప స్వభావాలు చర్చించ బడ్డాయి".

ఆచార్య రాయప్రోలు సుబ్బారావు గారు 1958లో భవభూతి రచించిన సంస్కృత "ఉత్తర రామచరిత" అనే సంస్కృత నాటకమును ఆంధ్రీకరించిరి. ఆ సమయమున వారిట్లు వ్రాసిరి. " నాకు చిన్నప్పటి నుంచి వ్రాసినది ఇతరులకిచ్చి వారు చదివితే వినే అలవాటు. ఆ సందర్భంలోనే రచనలో జరుగవలసిన

పరిష్కారమంతా కుదిరేది. ఆ సహకారం అందించారు ఆసక్తితో, ఆపేక్షతో శ్రీ ముట్నూరు సంగమేశంగారు. ఆయన మూడు భాషలలోని అందచందాలు తెలిసిన శాణికుడు". తిరుపతిలో మా నాన్నగారితో పాటు ప్రముఖ వ్యాస రచయితలు, ఆచార్యులైన డా॥ యస్.టి. నరసింహాచార్యా, డా॥ గుత్తి కొండ నాగేశ్వర రావు గారు, డా॥ పణతుల రామచంద్రయ్య గారు, డా॥ నాగయ్య గారు, శ్రీకామిశెట్టి శ్రీనివాసులు శెట్టి గారు, శ్రీ జయచంద్రా రెడ్డి గారు, ఆంగ్లో పన్యాసకులు శ్రీ ఆర్.ఎ. జయంత గారు సాహిత్య సమితి వ్యాసావళి అనే సంచికను ప్రచురించేవారు. మొదటి సంచికలో మా నాన్నగారు "గాథాసప్తశతి" అనే వ్యాసం రచియించినారు. శ్రీ ఆర్.ఎ. జయంతా గారు " కన్నడ జానపద గేయం. కె.గె.గెహారా అనే వ్యాసం వ్రాసినారు. గ్రంథావిష్కరణ శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు గావించిరి. శ్రీబాలజీ భవన్ తిరుపతిలో ఈ సమావేశం జరిగింది. అప్పుడు శ్రీమాన్ శర్మ గారు " నేను ప్రతి వ్యాసమును అత్యంత శ్రద్ధతో చదివాను. వ్యాసములన్నియు చాలా బాగున్నాయి. శ్రీసంగమేశంగారు తన వ్యాసంలో ఇంతవరకు తెలియని విషయాలు ఎన్నింటినో చర్చించినారు. ఈ సందర్భంలో వారు సంస్కృతమేగాక ప్రాకృతమును కూడా బాగుగా అధ్యయనము చేసి ఆకలించు కొన్నట్లు తెలియుచున్నది. తరువాత శ్రీకృష్ణ కర్ణామృతమనె వ్యాసం వ్రాయబడినది. కొన్ని సంవత్సరాల తరువాత శ్రీ మల్లంపల్లి శరభయ్య గారు శ్రీకృష్ణ కర్ణామృతము (బిల్వ మంగళ లీలాశుకుడు) అనేగ్రంధాన్ని వ్యాఖ్యాన సహితంగా వ్రాసి ప్రచురించేరు. దానికి ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు గారు, మా నాన్న గారి వ్యాసాలలో (శ్రీ కృష్ణకర్ణామృతం) కొన్నిభాగాలు విమర్శనార్థం గైకొనడం జరిగింది. బిల్వ మంగళ లీలా శుకుడు ఆంధ్రుడేనని చూపిన ఆధారాలు వానిని సమర్థిస్తూ మానాన్నగారు చేసిన వాదనలు బిల్వమంగలుని, శ్లోకాలను, భక్తులు, గాయకులు, అనునిత్యము పారాయణ చేసేవారన్న ప్రస్తావనలు డా॥ సుబ్బారావుగారు తమ పీఠికలో సమగ్రంగా వివరించినారు.



పలుచోట్ల, పలుమార్లు మా నాన్నగారు, సాహిత్య భక్తి, నృత్య, జ్యోతిష విషయములపై ప్రసంగించిరి. విశ్వ కవి రవీంద్రుడు, రామకృష్ణ పరమహంస వారి దివ్యసందేశములు, స్వామీ వివేకానంద, అన్నమాచార్య, త్యాగరాజు, భక్త కవి పోతన, ఆయన భాగవతమందుగల పలు విషయములు, భక్తి, రాసలీలలు అనువాద పద్ధతులు, నాట్య, ప్రస్తావనలు, మొదలగు వానిపై నేగాక, కవిత్రయము, కాళిదాసుని మేఘ సందేశము భారవి కిరాతార్జునీయము, హిందీలో తులసీదాసు, సూర్‌దాస్, ఆచార్య శ్యామసుందరదాస్, ఆచార్య రామచంద్రశుక్ల, శ్రీమతి మహాదేవివర్మ, జయశంకర ప్రసాదు, మైథిలీ శరణగుప్త మొదలగు వారి రచనలలోగల సాహిత్య రీతులపై ఏర్పాటుచేసిన కవితా గోష్ఠులలో పాల్గొని తనదైన స్థానాన్ని నిరూపించుకొన్నారు. శ్రీ జయశంకర్ ప్రసాద్ గారి సుప్రసిద్ధ కావ్యమైన 'కామాయని'ని తెలుగులోనికి అనువదించిరి. అష్టావధాన, శతావధానములలో పాల్గొనిరి. వారి కిష్టమైనది నిషిద్ధాక్షరి. అందువారు కడు సమర్థతతో చమత్కారంలో వ్యవహరించు చుండెడివారు. ఆకాశవాణి వారి నిత్య కార్యక్రమమైన సూక్తి ముక్తావళిలో కూడ పాల్గొనిరి. ఎన్నో రచనలు హిందీలోనే కాక, తెలుగు, ఇంగ్లీషులో కూడ వ్రాసిరి. కొన్నింటిని అనువదించిరి. వారు రచించిన కొన్ని గ్రంథములు వ్యాసములు అను బంధమందు చూపబడినవి.

## సన్మానాలు - పురస్కారములు - 8

మా నాన్నగారు సన్మానాలు అంటే ఇష్టపడేవారుకారు. అయినప్పటికి పలు చోట్లవారి యొక్కపాండిత్య పాటవానికి, వారి రచనలకు కలిగిన గుర్తింపునకు ఆదరణీయ సభలు జరిగినాయి. వారు రచించిన వేదవాఙ్మయము అనే గ్రంథావిష్కరణ ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రిగారైన డా॥ ఎన్.టి. రామారావు గారిచే గావింపబడినది. అప్పుడు వారు సన్మానింపబడ్డారు. తిరుపతిలోని కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం వారొక సారి పండిత సన్మానం గావించిరి.

ఓం

శ్రీకృష్ణ శరణం మమ

శ్రీ కోదండరామ మిత్రమండలి

తిరుపతి

ఆచార్య తిమ్మావఝ్ఝల కోదండరామయ్య

(1925 - 1981)

75వ జన్మదిన సాహిత్య పురస్కారము

1999వ సంవత్సరమునకు

డా॥ ముట్నూరి సంగమేశం గారికి

బహూకరింపబడినది

తిరుపతి
2-2-2000
75వ జయంతి

ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు
అధ్యక్షుడు
శ్రీ కోదండరామ మిత్రమండలి

అన్నమాచార్య కళాపీఠంలో సాహిత్య వేదికల సందర్భంగా శ్రీమాన్ తాళ్ళపాక అన్నమాచార్యుల 593వ జయంతి నాడు అనగా తేది. 8-5-2001 వారు అన్నమాచార్య సాహిత్యముపై వెలువరచిన సేవకు సన్మానించి ఫలపుష్పవేంకటేశ్వర స్వామి వారి ప్రసాదములతో సత్కరించిరి. ఒక వెండి డాలరు కూడ ఇచ్చిరి.



విశాఖలో గల అభినయా ఆర్ట్సు వారు, తిరుపతిలో గల తిమ్మావఝ్ఝల శ్రీ కోదండరామ మిత్ర మండలివారు ఆచార్య కోదండ రామయ్య గారి 75వ జన్మదినమున ఏర్పాటుచేసిన సాహిత్య సభలో సన్మానించిరి. దక్షిణ మధ్య రైల్వే గుంతకల్లు వారు రెండు పర్యాయములు, వారు ప్రతి సంవత్సరము నిర్వహించు రాజ భాషా సప్తాహములందు సత్కరించిరి. శ్రీ వేంకటేశ్వరా రసజ్ఞ సమాఖ్య. తిరుపతి వారు 1996లో ఆంధ్రప్రదేశ ప్రభుత్వం వారి సహకార, సౌజన్యంతో ఏర్పాటు చేయబడిన డా॥ మేడసాని మోహన్ గారి సాహితీ క్రతువు నందు వారికి పండిత పురస్కారము లభించినది.



మా నాన్న గారికి గల జ్యోతిష శాస్త్ర అభిరుచి పాండిత్యమును సద్వినియోగపరచుకొననెంచి భారతీయ విద్యా భవన్ తిరుపతి కేంద్రము వారు వారి యొక్క " జ్యోతిష భారతీ " సమితి యందు గౌరవ నిర్దేశకులుగా నియమించి గౌరవించిరి. ఆపరీక్షల కొరకు పాఠ్యావళిని కూడ తయారుచేసిరి. సదరు పరీక్షలకు ఆసక్తి గల వారికి ఉచిత శిక్షణా తరగతులు కొంతమంది జ్యోతిష విద్యాధికులతో కలసి నిర్వహించిరి.



తెలుగు హాస్యమునకు, తెలుగు భాషా సమితి హైదరాబాదు వారు రూ. 500/- నగదు పురస్కారము ఇచ్చిరి. ఆ గ్రంథమును ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారు 1954లో ప్రచురించిరి.



भारत सरकार

शिक्षा विभाग

मानव संसाधन विकास मंत्रालय

केंद्रीय हिंदी निदेशालय

GOVERNMENT OF INDIA

DEPARTMENT OF EDUCATION

MINISTRY OF HUMAN RESOURCE DEVELOPMENT

CENTRAL HINDI DIRECTORATE

# हिंदीतरभाषी हिंदी साहित्यकारों को पुरस्कार

# AWARD OF PRIZES TO NON-HINDI SPEAKING HINDI WRITERS

*1997-98*

यह प्रशस्ति—पत्र एम० संगमेशम (मातृभाषा – तेलुगु) को उनकी हिंदी भाषा में लिखित कृति गोदा-परिणय पर रु० 25,000/- (रुपये पच्चीस हजार मात्र) के पुरस्कार सहित हिंदी भाषा में उनके साहित्यिक योगदान के उपलक्ष्य में सम्मानार्थ प्रदान किया जाता है।

*This Certificate of Merit is awarded to* M. SANGMESHAM (*Mother Tongue* – Telugu) *on his literary work in Hindi entitled* GODA-PARINAYA *alongwith a* Prize Rs. 25,000/- (Rupees Twenty five thousand only) *in recognition of his literary contribution to the Hindi Language and Literature.*

(मुरली मनोहर जोशी)

मानव संसाधन विकास मंत्री

MINISTER OF HUMAN RESOURCE DEVELOPMENT

नई दिल्ली NEW DELHI

दिनांक DATED 31st March, 1999

సాహిత్య అకాడమీ న్యూఢిల్లి వారు 1970వ సం॥రంలో హిందీలో శ్రీ మోతీచంద్ గారి సుప్రసిద్ధ నవల సార్థవాహులు అనే పుస్తకాన్ని తెలుగులోనికి అనువదింప చేసినారు. కొంత కాలం తరువాత అది అత్యుత్తమ అనువాద గ్రంధంగా గుర్తించబడి సాహిత్య అకాడమీ వారిచే రూ. 1000/- నగదు పురస్కారమునకు ఎంపిక కాబడినది.

శ్రీ వేంకటేశ్వర రసజ్ఞ సమాఖ్య - తిరుపతి



మేడసాని మోహన సాహితీబుతువు

సంస్కృతాంధ్ర సహస్రావధాన క్రతువు

4-1-1996 నుండి 20-1-1996 వరకు

పండిత పురస్కారము

పేరు: శ్రీ ముట్నూరి సంగమేశం .................. అంశము: నిషిద్ధాక్షరి.

అద్వితీయ సుపూర్వమహాహ్లాదకరము లైన సహస్రావధాన సత్క్రతువు నందు
అర్థ ప్రచ్ఛక బాధ్యతలు నిర్వహించిన తమకు మా రసజ్ఞ సమాఖ్య సత్కరించినది

తిరుమల తిరుపతి దేవస్థానం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సహకార సౌజన్య సంశోభితం.

అధ్యక్షులు కార్యదర్శి

డిపార్టుమెంటు ఆఫ్ ఎడ్యుకేషన్ మినిస్టిరీ ఆఫ్ హ్యూమన్ రిసోర్సస్ అండ్ డెవలెప్‌మెంటు (భారత సర్కారు) ద్వారా నిర్వహింపబడిన అహిందీ రచయితలకు ఏర్పాటు చేయబడిన గ్రంధ రచన పోటీలో వారి 'గోదాపరిణయం' అనే హిందీ పుస్తకానికి భారత ప్రభుత్వం ద్వారా 1997-98 సంవత్సరమునకు గాను రూ. 25,000/- నగదు బహుమతి లభించినది.

చిన్న కథ దాని వికాసము, అన్నమయ్య వంటి చిన్న రచనలకు కూడ పారితోషకములు లభించినవి.

## రుచులు, అభిరుచులు - 9

మా నాన్న గారు,విద్యార్థి దశనుండి నటులు, గాయకులు. వారికి చిత్ర లేఖనము నందు కూడ ప్రవేశము గలదు. వారు తిరుపతి చేరినప్పుడు ఇక్కడ నిర్వహింపబడెడి లలిత కళాసమితి, నాట్యకళా మండలి, అమెచూర్సు అసోషియేషను వారి, నాటక, నాటిక, ఏక పాత్రాభినయన పోటీల యందు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించెడివారు. మా నాన్నగారి రచనావ్యాసంగము

మొట్టమొదట కథారచనలతో ఆరంభమై శాస్త్రగ్రంథ రచనల వరకు ఎదిగి వృద్ధిగాంచినది. వారి వ్యాసాలు కొన్నింటిని పాఠ్యాంశములుగా కూడ పాఠ్య పుస్తక సంపాదకులచే ఆమోదించి గ్రహించబడినవి. భక్తిని, భక్తి తత్త్వాన్ని తెలియ జేయడానికి వారు రచనా వ్యాసంగాన్ని విస్తృతంగా వాడు కొన్నారు. భాషాపరమైన సందేహాలు సాహిత్య సమస్యలపై వేద సందేహాలపై తన దగ్గరకి వచ్చిన వారిని సాదరంగా ఆహ్వానించి శక్తివంచనలేకుండా వారి సందేహాలు తీర్చేవారు. వారికి సంతృప్తికరమైన సలహాలు ఇచ్చేవారు. జ్యోతిష సంబంధమైన ఏ విషయానికైన ఆయన దగ్గరకు వచ్చిన వారిని సంతృప్తి పరచి, మంచిని, చెడ్డను రెండింటిని దాపరికము లేకుండా వారి సందేహాలను తీర్చేవారు.

మా నాన్నగారికి చదరంగమాటలో కూడ కొంత ప్రవేశమున్నది. వారికి ధనాపేక్ష లేదు. ప్రతిఫలాపేక్ష లేకుండా వారి పుస్తకాలు ఎందరికో ఉచితంగా ఇచ్చేవారు. వానిని వాణిజ్యపరంగా చూసి ధనార్జన చేయడానికి ఎప్పుడు ఏవిధమైన ప్రయత్నము చేయలేదు. అట్టి మహావ్యక్తి సాహిత్యోపాసకుడు అయిన మా నాన్నగారు 23-10-2001 అనగా స్వస్తిశ్రీ వృషనామ సం॥రం నిజ ఆశ్వీజ శుద్ధ సప్తమినాడు పరమపదించిరి.

## రచనలు - హిందీ గ్రంథములు



1. బాల భగవద్గీత          2. వేంకటేశ్వర సుప్రభాతము

3. వేంకటేశ్వర సుప్రభాత స్తోత్రం.
4. సర్వ సిద్ధాంత సౌరబ్ (అనువాదం)
5. తీర్థరాజ్ తిరుపతి
6. విశ్వామిత్ర (నవల)
7. తిరుమల మందిర్
8. మొల్లరామాయణం (అనువాదం)
9. అన్నమాచార్య అవుర్ సూర్‌దాస్ కా తులనాత్మక్ అధ్యయన్
10. అన్నమాచార్య అవుర్ సూర్ దాస్ సామాజిక శాస్త్రీయ అధ్యయన్ (డి.లిట్. కొరకు వ్రాసినది)
11. గద్యపద్యముక్తావళి (పాఠ్యగ్రంథము)
12. జయభారత్ హిందీ కితాబు (పాఠ్యగ్రంథము)
13. జయభారత్ హిందీ కితాబు 1 (పాఠ్యగ్రంథము)
14. జయభారత్ హిందీ కితాబు 2 (పాఠ్యగ్రంథము)
15. ఆదర్శహిందీ (6వ తరగతి నుండి 9వ తరగతి వరకు) (పాఠ్య గ్రంథము)
16. ఆదర్శ హిందూస్తానీ (బాలస్వబోధిని)
17. భగవద్గీతామకరందం (అనువాదం)
18. గోదాపరిణయం (ఆముద్రితం), (భారత సర్కారు వారిచే బహుమతి పొందిన గ్రంథము)

## 2) తెలుగు గ్రంథములు



1. తెలుగు హాస్యము (ఆంధ్ర సారస్వత పరిషత్తు వారిచే బహుమతి పొందిన గ్రంథము)

2. సార్థవాహులు (సాహిత్య ఆకాడమీ వారిచే బహుమతి పొందిన గ్రంథము)
3. వేదవాఙ్మయము
4. సంకేతనిధి (జ్యోతిష గ్రంథము)
5. దక్షిణాత్య నాట్యము (నాట్యశాస్త్ర గ్రంథము)
6. అన్నమయ్య
7. అన్నమాచార్య సాహితీ కౌముది
8. వాల్మీకి రామాయణంలో శాపములు - వరములు
9. నాటకాలలో హాస్యం (విస్తృత వ్యాసం)
10. తులసీదాసు (బాలసాహిత్యం)
11. నాగానందం (బాలసాహిత్యం)
12. వేణీ సంహారం (బాలసాహిత్యం)
13. దశకుమారచరిత్ర (బాలసాహిత్యం)
14. ఈడొచ్చినపిల్ల (కథలసంపుటి)
15. తెలుగు సాహిత్యములో నాట్యకళా ప్రస్తావనలు (అముద్రితము)

3) వ్యాసములు (హిందీ)

1. ప్రహ్లాద్ అవుర్ అజభర్ కా సందేశ్
2. తిరుపతి
3. శ్రీ తిరుమల తిరుపతి అవుర్ వల్లభాచార్య
4. లోక గీతోంకి సూచీ
5. తిరుమల తిరుపతి
6. సందేశరాసక్ అవుర్ భామాకలాప్
7. తెలుగుమే సాహిత్యకీ ప్రగతి
8. తిరుమలై మందిర్ మే సంగీత్ అవుర్ నృత్య్
9. రామాయణ రచయిత్రి మొల్ల

10. తిరుమల క్షేత్ర అవుర్ శిరోజ పహార్

11. మకర సంక్రాంతి

12. శ్రీరామనవమి

13. పదకవిత పితామహాశ్రీ అన్నమాచార్య - 1

14. భారతీయ సామజిక్ దర్శన్

15. అన్నమాచార్య అవుర్ సూర్ దాస్

16. శ్రీసూక్త

17. అన్నమాచార్య అవుర్ సంగీత రచన

18. పదకవిత పితామహ శ్రీఅన్నమాచార్య - 2

19. శ్రీవేద - తిరుమలాచార్య కృత వైరాగ్యవచన్ మాలికాగీత

20. సూర్యభగవాన్

21. రామాయణ అవుర్ భక్త కవి తులసీదాసు

22. శ్రీరామనవమి అవుర్ విఘ్నరాజ్ గణపతి

తెలుగు వ్యాసములు :

1. అద్యతన కవిత
2. సర్వజ్ఞకవి
3. తెలుగులోయతిప్రాసలు
4. చిన్నకథ దాని వికాసము
5. ఋగ్వేద సంహిత
6. దీపావళి
7. దేవ్యపరాధ
8. తిరుపతి క్షేత్ర రాజము
9. మాణిక్య వాచకర్
10. భక్తాంఘ్రిరేణుకులదేఖరాదులు
11. మధురకవులు - నమ్మాళ్వార్లు
12. ఆళ్వారులు - భగవత సాంప్రదాయం
13. శ్రీజయంతి
14. శారద నవరాత్రులు
15. రథసప్తమి
16. హోళిపండుగ
17. శ్రీమహాగణపతి
18. శ్రీ కృష్ణ కర్ణామృతము

19. తిరుచానూరు - కృష్ణాలయం

20. అన్నమాచార్యులు

21. అన్నమాచార్యుల జన్మతిథి - జాతకము

22. అన్నమాచార్యుల సంకీర్తనలు - అభినయ యోగ్యత

23. ఆంధ్రుల నాట్యకళ

24. చోడిగానికలాపం

25. జానపద నాట్యాలు

26. రామాయణంలో సంగీత నృత్యాలు

27. తులసీదాసు - రామకథా కల్పనలు

28. హిందీలో రామాయణ కథ

29. జ్యోతిషము

30. జ్యోతిషవిజ్ఞానము

31. చిలకమర్తివారి నాటకాలలో హాస్యము

32. తిరుమల తిరుపతి - కళారాధన

33. తిరుమళిశై - తిరుప్పణాళ్వారులు

34. శ్రీ ఆండాళ్ తిరుప్పావై

35. గాథా సప్తశతి (సంస్కృత గాథ)

36. తెలుగుకవి వేమన (కన్నడ వ్యాసం)

ఆంగ్లవ్యాసములు

1. Dharuvagana and Raga Alapana

2. Rasalila in Pothana's Bhagavatam

3. Annamacharya and Thyagaraj

4. Concept of Bhakti in Hindi Literature

5. Pre-Bharata and Post Bharata (Traditions of Natya Sastra)

సమీక్షించిన గ్రంథములు

| గ్రంథము పేరు : | గ్రంథ కర్త : |
|---|---|
| 1. రామాయణ రహస్యములు | డా॥ కె. శివసత్యనారాయణ |
| 2. సర్వదేవతా ప్రతిష్ఠా మందార: | శ్రీ పోతుకూచి శ్రీరామమూర్తి |
| 3. శ్రీమద్భాగవత రహస్యము (ప్ర.భా) | శ్రీపురాణపండ రాధాకృష్ణమూర్తి |
| 4. కుండలనీ యోగరహస్యము | శ్రీ కే. భాస్కర రావు |
| 5. శ్రీభగవన్నామము | డా॥ కే. శివసత్యనారాయణ |
| 6. ధర్మనిర్ణయచంద్రిక (ద్వి॥భా) | శ్రీ సూరివరపు వేంకటశివ సోమయాజులు |
| 7. మాండ్యూకగీతము | శ్రీ బి.ఎల్. సత్యనారాయణ శాస్త్రి |
| 8. సారంగపాణి కాపదసాహిత్య (హింది) | డా॥ టి.ఎన్. మురళి |
| 9. శ్రీవాసుదేవ కథాసుధ (3భాగములు) | శ్రీ పోలూరి హనుమజ్జానకీశర్మ |
| 10. దక్షిణాత్యనాటకాల్లో హాస్యగాడు | డా॥ కే. ఆనందన్ |
| 11. శ్రీజ్ఞానేశ్వర్ చాన్గదేవ్‌ల ప్రశస్తి | శ్రీ భమిడిపాటి శ్రీరామచంద్రుడు |
| 12. కార్గిల్ సమరం | ఎ. పండిరినాథ్ |

ఇది సంపూర్ణ పుస్తక వ్యాస సమీక్షల జాబితా కాదు ఇంకెన్నో ఉన్నాయని నా తలంపు.